# తుపాన్ దెబ్బ: కొత్త చిత్రాలు



అముదాలపల్లిలో (తాడేపల్లి తాలూకా) పసువులశాలలు-పడి 12 పసువులు మరణించిన దృశ్యము



చావగా మిగిలిన పసువులు నిలువనీడలేని దుస్థితి





కొల్లేరు కోకలపల్లి గ్రామము, పాలములు మునిగిన దృశ్యములు



కోకలపల్లి చిన్నంగ్రామంలో గ్రామము పూర్తిగా నాశనమైన దృశ్యము





ఏలూరుతో విజయవాడకు 9 రోజులు సంబంధములేకుండ చేసిన రోడ్డుగండ్లు - తెల్లప్రోలువద్ద గ్రాండుట్రంకురోడ్డు వరదలవలన కొట్టుకొనిపోయినది.





24 గంటల ప్రాణములను బలిగొనిన పీరలల్లి చెరువుకట్టకు పడినగండి. ప్రక్కనదియున్న గ్రాండుట్రంకు రోడ్డుకూడ కొట్టుకొనిపోయినది.



బందరులో బియ్యము కొరత: దుకాణము వద్ద బారులుతీరి నిలిచిన జనము

# తుపాన్ బాధితులకు సత్వర సహాయావశ్యకత

## రాష్ట్రపతి డా॥ పట్టాభి ప్రకటన

మదరాసు, నవంబరు 9: పట్టాభి సీతారామయ్యగారు, కాంగ్రెసు అధ్యక్షులు, ఆంధ్రదేశంలో తుపాను బాధితుల సహాయంగూర్చి యీ దిగువ విన్నపం చేయుచున్నారు.

"నేనుఢనిసాద చిరకాలం స్వరాష్ట్రం విడచి ఢిల్లీలో నుండవలసిన సమయాన ఆంధ్రజిల్లాలకు పెద్ద తుపాను ఉప్పెన వచ్చి నాశనమొనరించినందుకు నాకెంత విచారంగానుండో చెప్పవీలుగాకున్నది. కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, నాకన్న పాతికేండ్లు చిన్నవాడు, ఆప్రాంతాల సంచారంచేసి, జడివరోజ్లనుండా 15 మైళ్ళు కాలినడకను పోయి చూచివచ్చి ప్రకృతి విజృంభించి పెట్టినకష్టాలను వివరంగా మనకు తెలిపిరి. 1925 లో మే 15వ తేదీన యిట్టితుపానులో నేను చిక్కబడితిని. కనుక కృష్ణ, గుంటూరు, ఉభయగోదావరి, విశాఖజిల్లాలకు కలిగిన కష్టనష్టాలను బాగాఎరుగుదును. ఈవిషాదకేళుల ననుభవించిన కొన్నాలు జిల్లాకుయిటీవలనే పోయి వచ్చితిని. బాధితులకు సహాయం చేసే పనికి సేనే ముందంజవేయాలని సూచించబడెను, ఇట్టి బాధ్యత రాష్ట్రి కేంద్రపట్నమున ప్రథముపౌరునిగ నన్ను షెరీఫుదె యున్నది. కనుక నేను షెరీఫని కోరియుంటిని. బహుశ షెరీఫ్ గవర్నరు గారి అధ్యక్షతను యీ నెల 18వ తేదీన బహిరంగ సభ జరుపగలరు కలిగిన నష్టానికి తగిన సహాయం ఉండాలి మదరాసు ప్రభుత్వంవారిచ్చిన కొద్దిలక్షలు ఏమీ చాలవని కొందరి విమర్శలు చూచితిని. సహాయ కార్యములు రెండు విధములు: వెంటనే ఆహార వస్తువులు సప్లయి చేయుట. క్రమేణాయిండ్లు కట్టించుకొనుటకు, విత్తనాలకు, పునరావాసమునకు ధనసహాయం చేయుట ధనం ప్రోగుచేయుట సులభమే కాని జిల్లాలందు విదుస్కకొటాకులు మున్నను వస్తువులు పంచుటకష్టము. వస్త్రములు పంచుట మరికష్టము. ఈ పంపకమునందే వస్తువు దుర్వినియోగం చేయబడినట్లు 1925 లో నాకు తెలుసు. ప్రజల దుస్థితియే దుష్టుల లాభాలకు అవకాశ మిచ్చును. కనుక వాలంటీరు దళాలను మంచికట్టుదిట్టములతో స్థాపించాలి. మనలో ఉత్తములందుచేరి, వస్త్ర పంపకం పకడ్బందీగా జరిగేటట్లు చూడాలి. గుజరాతులో 1928 సం॥ వచ్చిన వరదలు గుజరాతీ దేశభక్తులకు అగ్నిపరీక్ష అయినదని చాలమందికి తెలియదు. అపుడు గుజరాతు గడించిన కీర్తి కామన్సు సభలోకూడ ప్రశంసించబడెను. ఆంధ్ర వాలంటీరులుకూడ, తమ ధర్మత్యాగ గుణములు చూపుటకు యిది మంచి అవకాశముగ నెంచవలెను. డబ్బు వసూలు కాకపోదు కాని దాన్ని సద్వినియోగం చేయుట, అత్యవసరమగు వస్తువులు కొని యిచ్చుటయందే రాష్ట్రం యొక్క తెలివితేటలగుపడును.

ప్రకృతి ఉగ్రరూపించునపుడు ముందుగ చెప్పిచేయదు. 1795లో ఉప్పెనవచ్చి బందరులో 10000 మందిని తుడిచివేసెను 1854 నవంబరు 4వ తేదీన అద్భుతవేమరల ఉప్పెనవచ్చి 30,000 మందిని చంపినది. ఈయేడు ఉప్పెన గోదావరి జిల్లాలో అమలాపురం తాలూకాపై బడినది. కృష్ణ జిల్లాలో నష్టానికి ఉపమేరు కారణం అచట కైకలూరు గుడివాడ తాలూకాలు ఎక్కువ నష్టపోయినవి. అచటి నివాసుల కన్న కాస్త ఎక్కువ అదృష్టవంతులగు మనం వారికందరికి సహాయం చేయుట మనవిధి.

# అధికార దఖలు పత్రంపై త్వరలో నైజాం సంతకం

## నవాబుతో వి. పి. మీనన్ చర్చలు

హైదరాబాద్, నవంబరు 9: నిజాంనవాబు అతిత్వరలో అధికార ప్రదాన పత్రంపై సంతకంచేయునని నేడు విశ్వసనీయంగా తెలియవచ్చింది. భారతప్రభుత్వ సంస్థానశాఖ రాజకీయసలహాదారు వి. పి. మీనన్‌గారు నేటిఉదయం కింగ్ కోఠీ భవనంలో నిజాంనవాబుతో సమావేశమయ్యెను. మేజర్ జనరల్ చౌధరీ, గవర్నరు జనరల్ కార్యదర్శి నవక్రైలాల్ గారలుకూడ దీనికి హాజరై చర్చలలో పాల్గొన్నారు.

ఈ సమావేశానికి సంస్థాన కాంగ్రెస్ నాయకులు, స్వామి రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణరావు, జనార్దనరావు దేశాయ్, దిగంబరరావు బిందూ, డా॥ జి. ఎస్. మేల్కోట్‌గార్లు హాజరయ్యారు. హైదరాబాదు మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌదరీగారుకూడ హాజరైనట్లు తెలుస్తున్నది.

సంస్థానంలో ప్రజాప్రభుత్వం ఏర్పాటుకుకూడ కాంగ్రెస్ నాయకులలో ఐకమత్యం అవసరమని మీనన్‌గారు చెప్పినట్లు తెలుస్తున్నది. తాను ఢిల్లీ వెళ్ళటానికిముందే వారు ఏకీభావానికి రావలసిందనీ, అది సాధ్యంకాని పక్షంలో నవంబరు 15 నాటికైనా రావలసిందనీ చెప్పినట్లు తెలుస్తున్నది.

ఈ విభేదాలు పరిష్కారం కాకుండా భారత రాజ్యాంగ పరిషత్తులో హైదరాబాద్ ప్రాతినిధ్యాన్ని గురించి గాని, ప్రస్తుతం సంస్థానంలో తాత్కాలిక ప్రజా ప్రభుత్వం ఏర్పాటు చేయటాన్ని గురించిగాని, తక్షణ నిర్ణయం చెయ్యటానికి భారతప్రభుత్వానికి వీలుగాకుండా ఉన్నదనికూడ మీనన్‌గారు చెప్పినట్లు తెలుస్తున్నది. సమావేశానికి హాజరైన కాంగ్రెస్ నాయకులందరూ ప్రస్తుత ప్రభుత్వంలోకి ప్రజాప్రతినిధులను చేర్చే విషయాన్ని యికఎట్టి ఆలస్యం లేకుండా తక్షణం అమలు చెయ్యవలసిందని ఆతురతతో పలికినారట. కాని వారు తమ విభేదాల పరిష్కారానికి ఉపాయాన్ని సాధించినట్లు ప్రస్తుతము కన్పడలేదు ఈ విషయమై సాధ్యమైనంత త్వరలో ఒక పరిష్కారానికి రావటానికి ఉభయపక్షాలు ప్రయత్నాలు చెయ్యగలవని తెలుస్తున్నది.

పాటేకాంగ్రెస్ నాయకులలో ఒకరు మాట్లాడుతూ, ఉభయపక్షాలవారు కాంగ్రెసుసంఘ విషయంలో ఎదటివారి భావాలను అర్థంచేసుకొని గౌరవించే పక్షంలో సంస్థాన కాంగ్రెసువాదులు తమ విభేదాలను పరిష్కరించుకోవటం దుస్సాధ్యం కాదని, అన్నారు. సంస్థానప్రభుత్వంలో కాంగ్రెసేతర పక్షాలకు ప్రాతినిధ్యమిచ్చే విషయంలోకూడ ఉభయులు ఒకరి భావాలను ఒకరు మన్నించవలెనన్నారు.

నిజాం సంస్థాన రైల్వే కార్మికుల యూనియన్ అధ్యక్షుడు వి. డి. రాజు, మాధవరావు ఆన్వారిగార్లు తాము మీనన్‌గారిని కలుసుకొని, హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తు విషయమై కొన్ని వివరము లడిగి తెలుసుకొన్నామని చెప్పారు.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 10

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు.76-12-0 పెట్లు బంగారు తులం 115-4-0 సూసబంగారు 112-12-0 సీమవెండి తులం 100-కి (రెడి 169-0-0 వెండి తులం 1 కి 1-11 6

వేరుసెనగ: (581 సౌ 1-కి ఎక్స కోస్టాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 148, 149 వేరుసెనగనూనె ఎక్సపెల్లర్ (ఏవరేజి) రు. 332-0-0, 333- -0

నవంబరు అండ్ డెలివరీ రు. 327-8-0, 328-8-0

కొంకాయనూనె (37 పౌన్లు గల డబ్బా) ఒకటికి రు. 33-8-9, కొచ్చిన్ 34-12-9, 35-0-9 పెనాంగు.

పంచదార

పాట్రీ (2 అందరు) రు.91-14-9

చక్కెర చిల్లరధర వీశ 1-కి 1-4-

## రేడియో ప్రోగ్రాములు

నవంబరు 12 శనివారం

### మద్రాసు (ఎ)

ఉ. 7-30 ఇ. ఎస్. బాల, ఎల్. ఎస్. కవుల, పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయసంగీతం (రి) 8-30 మద్రాసు (బి) వలె. మ. 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం. (రి) 4 పిల్లల కార్యక్రమం. ఆంగ్లమున 4-30 పాశ్చాత్య సంగీతం. (రి) సా. 5-30 కామాక్షి చంద్రశేఖరన్ వీణ. 6 ఆంగ్లమున వార్తలు 6-20 పద్మశ్రీ సుందరం పాట. 7 సతార్. 7-30 గీతమంజరి. (రి) 7-54 ఎల్. సి. వసంత కోకిలం గాత్రం. వి. గోవిందస్వామి నాయకర్ వయొలిన్. కల్పాతి, ఎ. రామ నాథన్ మృదంగం, విల్వాద్రి అయ్యర్ ఘటం. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 ఆంగ్లమున ప్రసంగం. 9 30 మద్రాసు (బి) వలె. 10 పాశ్చాత్యసంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 మన్నార్ రంగరాజన్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 బాలానందం నిర్వహణ. న్యాపతి కామేశ్వరి. మ. 1 మహిళామండలి 'వలపుపాటలు' పద్య గేయం. ప్రమాదంసుమా! మరదలితో పెండ్లి సంబంధం చూడటం, ప్రసంగం కామేశ్వరి పద్మావతి దేవి, ద్విలుబాధ్వం మహిళాలోకం. 1-30 మద్రాసు (ఎ) వలె. 4 మద్రాసు (ఎ) వలె సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం. (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. ప్రాచీన భారతరాజ్యాంగ విషయాలు, ప్రధానుల మాటలు. ప్రసంగం భావరాజు వెంకటకృష్ణరావు, భజమున రామ్, తులసీదాసు భజన్. విశేషాలు, ప్రకటనలు, ధరలు, వాతావరణ వివరాలు. 7 తెలుగున వార్తలు. 7-15 ఫిల్మ్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 9-30 ఎం. ఎల్. వసంతకుమారి (రి). 9-45 గీతా ఆర్కెస్ట్రా నిర్వహణ. సి. ఆర్. శ్రీనివాసన్. 10 శాస్త్రీయ సంగీతం (రి).

### విజయవాడ

ఉ. 7. తెలుగువార్తలు. 7-15 ఎం. ఎల్. విశ్వనాథ అయ్యర్, పాట 7-30 పి. లక్ష్మణరావు, వేణువు. 8. ఆంగ్లమున వార్తలు. 8-15 శ్రోతలు కోరిన పాటలు. (రి) 8-30 మురుగంటి రంగనుతి. పాట. మ. 3 తారాపథం (రి). 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగువార్తలు. 4. బొమ్మరిల్లు. పరుగునరాలి. పేదవాని ప్రశ్నలు. 'నాటికా' మా తాత. పాట. మన శాస్త్రాలు చిలకోధ తపాలాపంచి. సా. 5-30 పి లక్ష్మణరావు, వేణువు. 6. ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి. పంకజమల్లిక్ రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7. తెలుగువార్తలు. 7-30 ఉభయకుశలోపరి శ్రోతల ఉత్తరాలకు జవాబులు. 7-45 మద్రాసువలె. 9. ఆంగ్లమున వార్తలు. 9.15 ఆంధ్రదేశపు జానపద గేయాలు. మార్పు వర్ణన. ప్రయాగ కోదండరామశాస్త్రి 9-30 గానసుధ. (రి). 9-40 ఎం వి. నాగరాజు. ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా.

### హైదరాబాదు

ఉ 7-40 గులాం సిద్దీక్‌ఖాన్. ఖయాల్ లలిత. 8 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 8-20 తిల్లాన శంకరశాస్త్రి. 8-50 తెలుగున వార్తలు. 9-15 సంయుక్త హార్డికర్ భావగీత్. మ 12-30 రికార్డులు. 1 తారాపథం (రి) 1 30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ.ఐ.ఆర్. రిలే) సా 5 గులాంసిద్దీక్‌ఖాన్ ఖయాల్ ముల్తానీ 5-15 సంయుక్త హార్డికర్ భజన్. 5-30 ఖుసోయి దాద్రా. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. తెలుగున రచ్చకట్టు రాజకీయాలు. రచన కె. వి. ఎన్. శాస్త్రి హాస్యగీతాలు (రి) 7 తెలుగున వార్తలు 7-15 పురాణం. జానపద గేయాలు. కె. వరలక్ష్మి 8-30 గులాంసిద్దీక్‌ఖాన్, ఖయాల్ శంకర 8-45 ఎస్. కె. రాజలక్ష్మి వీణ. 9 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ ఆర్. రిలే.) 9-15 శ్రోతల పరిచయం 10-5 గులాంసిద్దీక్‌ఖాన్ ఖయాల్ కాంబుజ 10-20 సంయుక్త హార్డికర్.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 9:

డిసెంబరు 30.07 / 30 07 మార్చి 30.05 / 30.06 మే 29.97 / 29.97 జూలై 29 60 / బిడ్ 29.62 ఆస్కుడ్ అక్టోబర్ 28.11 / 28.11 డిసెంబరు 28 08 / బిడ్ 28.04 ఆస్కుడ్ మార్చి 27 98 / బిడ్ 28 00 ఆస్కుడ్.

| | | |
|---|---|---|
| స్టెర్లింగ్ | బజారు | 30.67 |
| డిసెంబరు | (గరిష్ఠధర) | 30 07 |
| | (కనిష్ఠధర) | 30. 4 |

అక్టోబరు వాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | వెల | 30 04 |
| | నిన్న | | 30 08 |
| ,, | ముగింపు | వెల | 30 07 |
| | నిన్న | | 30 08 |

## బ్యాంకుల వ్యాపార మాంద్యము

### అధికంగా ధనం నిల్వ

బొంబాయి, నవంబరు 8: ప్రతిసంవత్సరమున్నూ సెప్టెంబరుమాసము మొదలుకొని బ్యాంకులు వర్తకుల కిచ్చేడి అప్పుల మొత్తము హెచ్చు అగుచుండును. వ్యాపారము బాగా సాగేటటువంటి సంవత్సర భాగము సెప్టెంబరుతో ప్రారంభ మగుచుండును. ధాన్య సేకరణ చేయుటకు గాని, ప్రతి గోనువారి సరకు రవాణాకు గాని వర్తకులు బ్యాంకులలో అప్పులు తీసికొనుచుందురు. ఈ అప్పులు వర్తకులు తీసికొనుట సెప్టెంబరులో ప్రారంభమై జనవరి మాసంనాటికి అప్పు ఖాతాలు అత్యధిక సంఖ్యా ప్రమాణంలోనికి వచ్చును.

గత సంవత్సరం అక్టోబరు మొదటివారములో దేశములోని షెడ్యూల్డు బ్యాంకులన్నియు యిచ్చిన అప్పుల మొత్తము రూ 390 కోట్లనుండి రూ 404 కోట్లకు హెచ్చెను. ఒక్క వారంలో రూ 14 కోట్లు హెచ్చెను. ఈ సంవత్సరం అక్టోబరు మొదటివారంలో బ్యాంకు లన్నింటి యొక్క అప్పు ఖాతాలసరళి మొత్తము రూ 411 కోట్లనుండి రూ 390 కోట్లకు తగ్గెను అనగా 24 కోట్లు తగ్గెను.

భారతదేశంలోని బ్యాంకులవద్ద పైకం ఎక్కువగా నిల్వయున్నది. ఇండియను బ్యాంకులకు పైకం కావలెనంటే ఎప్పుడడిగితే అప్పుడు వాపసు చేసే పత్రములను నూటికి 3 సాలుకు 0-8-0 చొ॥ వడ్డీకి యివ్వబడగలదు. మూడుమాసాలలో వాపసుచేసే పరతుకు నూటికి సాలుకు రూ 1-4-0 వడ్డీరేటుకు, 6 మాసాలలో వాపసుచేసే పరతుకు రూ 1-8-0 రేటుకు పైకం లభించగలదు.

గతసంవత్సరము వర్తకులకు అప్పులు ఎక్కువగా బ్యాంకులు యివ్వవలసివచ్చుటచేతను, బ్యాంకులకు పైకం రిజర్వుబ్యాంకు సప్లయి చేయవలసివచ్చుటచేతను రిజర్వు బ్యాంకు గత సంవత్సరం రూ 1214 కోట్ల వరకు కరెన్సీనోట్ల చలామణిని వృద్ధిచేయవలసివచ్చెను. కాని యీ సంవత్సరము అక్టోబరు మాసంలో రూ 1085 కోట్ల చలామణిని రూ 1073 కోట్లకు రిజర్వు బ్యాంకు తగ్గించెను.

పాకిస్తానుకు ఇండియాకుమధ్య వ్యవహార ప్రతిష్టంభన ఏర్పడి గోనునార రవాణాలు, ప్రత్తి రవాణాలు నిలిచిపోయినందువ వ్యాపారంచాలా స్తంభించినది. రవాణాలకు అనేక నిరోధములు కల్పింపబడెను. ఈ కారణాలవల్ల బ్యాంకు వ్యాపారమున మాంద్యమేర్పడినది.








## "కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగదు"

### నంద్యాలలో డా॥ పట్టాభి విస్పష్ట ప్రకటన

### ప్రభుత్వాలు, కాంగ్రెసు పరస్పర వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోరాదని హెచ్చరిక

కర్నూలు, నవంబరు 9: "ఇంకొన్నాళ్లలో జరుగబోయే ఎన్నికలలో పాల్గొనటానికి అవకాశమిస్తూ, ఎన్నికలకుముందు కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగించబడుతుందా? అన్న ప్రశ్నకు తొలగించబడదనే నా సమాధానం. ఎందుకంటే రాజకీయాలలో ఏ అక్రమ సంస్థా ప్రవేశించటానికి వీలులేదు." అని డాక్టర్ పట్టాభిసీతారామయ్యగారు నేడు తన అభిప్రాయం వెలిబుచ్చారు.

నిన్న నంద్యాలలో ఒక పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ రాష్ట్రపతి ఇంకా ఇల్లా అన్నారు

"కమ్యూనిస్టులవల్ల దేశాన్ని బాధించే పెద్ద ఉపద్రవమేమీలేదు. ఏదో అక్కడక్కడ జరిగిన సంఘటనలన్నీ మనకు ప్రత్యక్షంగా కనపడుతూనే వున్నాయి ప్రభుత్వం వీటిని చూస్తూ ఊరికే కూర్చోలేదు; ఏమరివుండటానికికూడా వీల్లేదు. కమ్యూనిస్టులు కాంగ్రెసుకు బద్ధవైరులు. గత యుద్ధకాలంలో వారు సమ్మెలను నిరసించి, బ్రిటిష్ ప్రభుత్వ మిత్రులుగా పనిచేశారు. కాని తరువాత కాంగ్రెసు అధికారంలోకి వస్తున్నదని తెలిసి, కాంగ్రెసు సెల్లాగైనా చీకాకుపరచవలెనని సమ్మెలను ప్రోత్సహించటం మొదలుపెట్టారు.

కమ్యూనిస్టుపార్టీలో చీలికలు బయలుదేరినవంటున్నారు. వాళ్లలోవాళ్లకి చీలికలు రావచ్చు, పోవచ్చు. కాని మిగతా వారిమీద వారంతా ఏకముఖం గా శత్రుత్వం సాగిస్తారు"

ఒక ప్రశ్నకు జవాబిస్తూ, "కొందరు మద్రాసు మంత్రుల" మీద ఆరోపణలు వదలివేయబడినవనుట నిజంకాదనీ, ఈ విషయాన్ని కాంగ్రెసుకార్యవర్గం ఇంకా పరిశీలిస్తున్నదనీ డా॥ పట్టాభి చెప్పారు.

క్రొత్త ఎన్నికలు జరిగిన తర్వాత కాంగ్రెసు రద్దుఅయిపోతుందా అన్న ప్రశ్నకు రద్దు కాదని జవాబిస్తూ, దేశమంతటా నైతికపతనం ప్రబలిందనీ, ప్రజల నైతిక దార్ఢ్యంమీదనే ప్రభుత్వం దార్ఢ్యం ఆధారపడివుందనీ దేశంలో నైతిక బలాన్ని పునరుద్ధరించే భారాన్ని కాంగ్రెసు వహించినదనీ డా॥ పట్టాభి అన్నారు.

"కాంగ్రెసు కేంద్రంలోగాని రాష్ట్రములలోగాని ప్రభుత్వ వ్యవహారాలలో జోక్యం కల్గించుకోరాదు. అయితే ప్రభుత్వాలుకూడా కాంగ్రెసు సంస్థను గౌరవించవలసి వుంటుంది. లేకపోతే నాటికి ముందూ, వనకా ఆధారమే వుండదు" అని రాష్ట్రపతి ఉద్ఘాటించారు.

ఆంధ్ర రాష్ట్రమును గురించి చెబుతూ, "నాకు ఆంధ్ర రాష్ట్రంలోనూ, మరెక్కడాగూడా అధికారవాంఛ లే"దని పట్టాభి నొక్కి చెప్పారు.

ఆర్. ఎస్. ఎస్. సభ్యులను కాంగ్రెసు సేవాదళములోనికి చేర్చుకోరాదని ఆయన ఖండితంగా చెప్పారు.

రాబోయే ఎన్నికలలో కాంగ్రెసు గెలుస్తుందా? అని ఒక విలేఖరి అడగ్గా, "మీఅశలో నేనుగూడా వాటా పుచ్చుకుంటున్నా" నన్నారు డా॥ పట్టాభి.

### కర్నూలు పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుని రాజీనామా

కర్నూలు, నవంబరు 7: ఈ పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు కె. సి. తిమ్మయ్యగారు తన పదవికి రాజీనామా యిచ్చినట్లు నిన్న ఒక బహిరంగసభలో ప్రకటించారు. (స్వ. వి)

### నవంబరు 14 న రాజ్యాంగ పరిషత్

న్యూఢిల్లీ, నవంబర్ 8: రాజ్యాంగ పరిషత్ సమావేశాలు తిరిగి నవంబర్ 14 వ తేదీ ప్రారంభమౌతవి మొదటి రెండు సమావేశములలోనూ, ముసాయిదా మీద సభవారు ఆమోదించిన సవరణలు సరియైన పద్ధతిలో ముసాయిదాలో చేర్చబడినవో లేదో అనే విషయాన్ని చర్చించుతారు. సవరణలు చేర్చిన ముసాయిదా ప్రతులను సభ్యులకు రోగపడాకే అందజేశారు.

అనంతరం అంబేద్కర్ "రాజ్యాంగ ముసాయిదాను సభవారు ఆమోదిస్తున్నారు" అనే లాంఛనప్రాయమైన తీర్మానాన్ని ప్రతిపాదించుతారు. దీని అనంతరం రాజ్యాంగ ముసాయిదా తృతీయ ప్రతిపాదన ప్రారంభమవుతుంది. ఈ కార్యక్రమం పదిరోజులు పడుతుంది.

### రాజ్యాంగ పరిషత్తుకు మినహా మసానీ ఎన్నిక

బొంబాయి, నవంబరు 8: భారత రాజ్యాంగ పరిషత్తునుండి, కాంగ్రెసు పార్టీ సభ్యత్వమునకు రాజీనామా యిచ్చినందున ఆ సభ్యత్వఖాళీకి మరొకరిని ఎన్నుకొనుటకు ఉపఎన్నిక జరిగెను. ఈ ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థియైన ఇదివరకు ప్రజేబులలో భారతరాయబారిగా పనిచేసిన యం. ఆర్. మసానీ గారు ఎన్నుకోబడిరి. వీరిలో పోటీచేసిన హ్రైంశివరావు అభ్యర్థిత్వమును రాం. జి. మున్షీలు గారు తమ అభ్యర్థిత్వమును పేపు ఉపసంహరించుకొన్నందున మసానీ గారు పోటీలేకుండా ఎన్నుకోబడిరి.

## ఆం. రా. మోటారు యూనియన్స్ కాంగ్రెస్ తీర్మానాలు

విజయవాడ, నవంబరు 8: ఇటీవల ఈ నగరంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర మోటార్ యూనియన్స్ కాంగ్రెసు 5 వ మహాసభలో మద్రాసు ప్రభుత్వమునకు తమకోర్కెలను తెలియజేస్తూ ఈ క్రింది తీర్మానాలు చేయబడినవి.

"ట్రాన్సుపోర్టు వ్యాపారంలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఏ విధమైన స్వప్రయోజనాలులేని ఒకరిని ప్రాంతీయ, కేంద్ర, ట్రాన్సుపోర్టు అధికార్ల సంఘములలో అనధికార సభ్యులుగా నియమించవలసినదని ప్రభుత్వమును కోరుతున్నాము.

ఎ. బి. పర్మిట్లను మామూలు మార్గములోనే ట్రాన్సుఫరు చేసుకొనుటకు అనుమతించవలెనని ప్రాంతీయ ట్రాన్సుపోర్టు అధికార్లను ఆదేశించవలెను బస్సురేట్లు మాత్రం కాసులకు పెంచనివ్వవలెను. ప్రయాణీకులు అధికంగా ఎక్కటం చుకొన్నందుకు అనేక బస్సులకు జుల్మానా విధింపబడుతున్నది. బస్సులు తక్కువ కావటంవల్లా, పెట్రోలులేక బస్సుట్రిప్పులను తగ్గించివేయటంవల్లా, అత్యావసరాలు కలిగి తొందరపడే ప్రయాణీకులకు సహాయము చేయవలెననుకోవటంవల్లా ఓవర్‌లోడ్ జరుగుతున్నది. కనుక ప్రభుత్వము అసలు సీటింగు ప్రమాణంకంటె నూటికి 25 వంతులు ఎక్కువను అనుమతించవలెను.

స్పేర్ బస్సులపై పన్నును తొలగించవలెను. రాకపోకల సమ్మర్దం ఇదివరకు అంతటి రద్దీగా లేనందున ఎవరికి వసతేవారికి పర్మిట్లు ఇవ్వరాదని వివిధ ప్రాంతీయ ట్రాన్సుపోర్టు అధికార్లను ఆదేశించవలెను. ప్రజాసౌకర్యంకోసం ప్రక్కజిల్లాలలోకిపోయే లారీలను అల్లా స్వేచ్ఛగా పోనివ్వవలెనని కూడా వారిని ఆదేశించవలెను. అనాలోచితంగా తాత్కాలిక పర్మిట్లను ఇవ్వడం హానికరంగా వుంది కనుక దాని నాపు చేయించవలెను.

శ్రీ టి. పి. ఎస్. దొరస్వామి, కటారి సుబ్బయ్య, రామినేని కృష్ణయ్య, జన్నా గోవిందరాజులుగార్ల మృతికి చింతిస్తూ వారి కుటుంబాలకు సానుభూతి తెలుపుతూ తీర్మానాలు చేయబడినవి.

### పెన్నానది గట్టునుండి దేవతా విగ్రహాలు బయల్పడుట

కుల్లూరు సమీపంలో సంఘటన

నెల్లూరు, నవంబరు 7: ఇచ్చట నుండి సోమశిల మహాక్షేత్రమునకు బోవు దారిలో కుల్లూరు గ్రామ సమీపమున ఉ తరపినాకినీ నది ఒడ్డు ఇటీవలి వరదలవల్ల, కోసుకొని, కళాలింగము, వీరభద్ర స్వామివిగ్రహము, పురాతన కట్టడములు పునాదులు బయల్పడినవి. వేలకొలది ప్రజలు వచ్చి చూచిపోవుచున్నారు దీని సమీపమునవే ఖడ్గతిక్కన యుద్ధముచేసిన ప్రదేశముగలదు. (స్వ. వి.)

### తూర్పు పాకిస్థాన్‌లో కర్ఫ్యూ ఉత్తర్వు

జనపనార రహస్య ఎగుమతికి ప్రతిక్రియ

మైమన్‌సింగ్, నవంబర్ 8: ఈ జిల్లా తూర్పు పాకిస్థాన్ ప్రభుత్వం ఇక్కడ రహస్యంగా జనపనార ఎగుమతి అరికట్టడానికి సాయంత్రమయ్యాం మొదలు సూర్యోదయం వరకు కర్ఫ్యూ ప్రకటించింది. కర్ఫ్యూ లేర తూర్పు పాకిస్థాన్ సరిహద్దుల రెండు మైళ్ళ ప్రదేశంలో రాత్రి పూట ఎవ్వరూ సంచరించకూడదు.

## కార్మిక వ్యవహార సంబంధ చట్టం

### ప్రభుత్వం తయారు చేస్తున్నదని జగ్జీవన్‌రాం

పాటియాలా, నవంబరు 7: కార్మిక వ్యవహార సంబంధముల కన్నింటికి వర్తించేడి ఒక సర్వసమగ్రమైన చట్టమును తయారుచేయుటకు ఇండియా ప్రభుత్వము పూనుకొని పనిచేయుచున్నదనియు, యీ చట్టము దేశములోని అన్ని రాష్ట్రీయ ప్రభుత్వములకు సమ్మతముగా నుండగలదనియు, యీ చట్టమును శ్రద్ధగా అమలుపరచినయెడల నిష్కపటమైన కార్మిక తగాదాలన్నియు పరిష్కారము కాగలవనియు తెలియజేయుచు ఇండియా ప్రభుత్వ కార్మిక శాఖామంత్రియగు జగ్జీవనరాముగారు నేడు పాటియాలాలో ప్రారంభమైన త్రిపక్ష కార్మిక మహాసభకు సందేశమును పంపిరి.

ఈ సందేశములో జగ్జీవనరాముగారు ఇట్లు వ్రాసిరి: దేశమునకు స్వాతంత్ర్యము లభించినప్పటినుంచి కార్మికవర్గములందు ప్రబోధం కలిగినది. కాని, యిప్పుడు దేశమొక మాతన పరివర్తనావస్థలో ఉంది కొత్త మార్పులు జరుగవలసియున్న యీ సమయములో సంఘర్షణలు సంభవింపగలవు. ఈ సంఘర్షణలను సమన్వయించుటకు మనము ప్రయత్నించవలెను పరిశ్రమల యజమానులకును కార్మికులకును వ్యవహారములు సౌమ్యంగా సాగుతూ ఉంటేనే గాని దేశంలో శాంతిఉండదు.

## చెన్నపురి భవితవ్యం

### ఆంధ్ర స్వరాజ్యపార్టీ సూచనలు

విజయవాడ, నవంబరు 8: ఆంధ్ర స్వరాజ్యపార్టీవారి కార్యవర్గసభ గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారి అధ్యక్షతను మొన్న నిక్కడ జరిగెను. దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులు, బారిస్టర్ గుర్లపాటి వెంకటేశ్వరరావు, డాక్టర్ నారాయణ దామోదర సావర్కార్‌గార్ల మరణములకు సభవారు తమ సంతాపమును వెలిబుచ్చిరి.

ఆంధ్రరాష్ట్ర విషయమై చెన్నపురి గూర్చి డాక్టర్ పట్టాభిగారి యిటీవల వ్యాఖ్యానమును గుర్తించి యిందుపై ఆంధ్రులలో ఏకీభావ మేర్పడుటకై యీ దిగువదగుటలలో చెప్పిన ఒకమార్గమున దక్షిణమాంధ్రరాష్ట్రమును కోరవలెనని చెన్నపురి ప్రభుత్వమును, ఆంధ్రమహాజనులను కమిటీవారు హెచ్చరించిరి: చెన్నపురిని ప్రత్యేక లెఫ్టినెంట్ గవర్నర్ రాష్ట్రముగ జేయుట; లేదా నిగూర్చి భావి పరిహద్దు సంఘ పరిష్కారమునకు వదలుట, లేదా, ఇందుకై యిప్పుడే సరిహద్దు సంఘము నేర్పరచుట. ఇందు రెండవ పద్ధతిలో భారత ప్రభుత్వమే చెన్నపురియొక్క తాత్కాలికపాలనకై వలయు నేర్పాటుల జేయవలెను. ఈ కాలములో ఆంధ్ర, మిళ రాజధానులు రెండును చెన్నపురిలో నుండును.

ఈ రీతిగ వెంటనే ఆంధ్రరాష్ట్ర మంగీకరించి, షెడ్యూలువందు జేర్చబడవలెను.

తిరుపతి కమిటీవారు రాష్ట్ర దేశ ఆర్థిక పరిస్థితిని పరిశీలించి దేశమంతయు క్లిష్ట ఆర్థికపరిస్థితి నెదుర్కొనుచుండగా, చెన్నపురి ప్రభుత్వముపై కూర్చి ఉదాసీనత జూపుట ఖండించుచును, రైతులవద్ద నుండి బలవంతముగా ఋణములు గ్రహించుటకూడదనీ, జమీందార్లు కొనసాగదలచిన ముజరాయి రకు ప్రజలందరివద్ద నుండియు పన్నులు గ్రహించుట అక్రమమనీ, ఇదుకై యు పి. లో వలె జమీందారి రైతుల ల్ల ఐచ్ఛికనిధులను సేకరించవలెననీ తీర్మానించిరి.

రైల్వే కంపెనీల వర్గీకరణము కమిటీవారంగీకరించుచు, ప్రస్తుత ఎం. ఎస్. ఎం; ఎస్. ఐ. ఆర్; బి. ఎన్. రైల్వేలో కొంతభాగము "ఆంధ్ర రైల్వే"యను పేరుతో నొక శాఖగ నుంచవలెననియు, దీనికి విజయవాడ కేంద్రము కావలెననియు వేరొక తీర్మానం చేసిరి.

ఇటీవల వరదలకును, గాలివానకును గురియైన ఆంధ్రప్రజలయెడ సానుభూతిని ప్రకటించుచు గవర్నర్ జనరల్ గారు వీరినొక క్రీ గంటపైన యిరు జూడకుండుటకు ఏపగించుచు మరొక తీర్మానం చేసిరి.

## ఆంధ్రరాష్ట్రము: రాయలసీమ సభ్యుల వైఖరి

పట్నం, నవంబర్ 9: ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సందర్భమున రాయలసీమ వారి కర్తవ్యమును నిర్ణయించుటకు మంత్రి సంజీవరెడ్డిగారి గదిలో నిన్న మధ్యాహ్నం రాయలసీమ శాసనసభ్యులు, ప్రముఖులు సమావేశమైరి. అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావు గారు నాయకత్రయ నివేదికను అంగీకరించుట తప్ప ఇప్పుడు ఆంధ్రుల కు గత్యంతరములేదని తెలిపినటుల తెలియుచున్నది. రాయలసీమ వాసులకు కొన్ని రక్షణలు కావాలని కొందరు, ప్రాజెక్టులు, విద్యాసంస్థల సందర్భమున అధిక ఆదరము అవసరమనియు మరికొందరు తెలిపిరట. మొత్తంపై ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణమునకు అధిక సంఖ్యాకులు సుముఖత ను తెలిపిరి, కొందరు మద్రాసు లేనిదే రాయలసీమ ఆంధ్రరాష్ట్రమున చేరుట రాయలసీమ వారికి ఇష్టములేదనియు తెలిపినటులను తెలియుచున్నది. రాష్ట్ర నిర్మాణము సందర్భమున అధిక సంఖ్యాకులు ఇష్టమును కనుపరచిరనియు ఎట్టి నిర్ణయమును చేయక మరల ఒకసారి సమావేశమగుటకు వారు నిర్ణయించిరనియు తెలియుచున్నది.







# ప్రజాశాంతి రక్షణచట్టంపై అసెంబ్లీలో క్లాజువారీ చర్చ

## సభ్యుల విమర్శకు మంత్రి సమాధానం

చెన్నపట్నం, నవంబర్ 9: మద్రాసు అసెంబ్లీ సభ నేడు స్పీకరు శ్రీ జె. శివషణ్ముగంపిళ్ళగారి అధ్యక్షతను సమావేశమైనపుడు ప్రశ్నోత్తరములకు తరువాత ప్రజాశాంతి రక్షణబిల్లుగూర్చి చర్చ సాగినది.

బేగం సుల్తాన్ అమీరుద్దీన్‌గారు బిల్లు గూర్చి ప్రసంగిస్తూ దురదృష్టమైన భారత దేశములో స్వాతంత్ర్యము సిద్ధించిన నాటినుండి పరిస్థితులు చక్కబడలేదనియు, నిర్బంధవిధానము కట్టుదిట్టముగ ప్రభుత్వమువారిచేనే యుపయోగింపబడుచున్నదనియు, దేశములో వ్యక్తి స్వాతంత్ర్యమునకు తగు రక్షణ లేకపోతే మనకు స్వరాజ్యం ప్రాప్తించి యున్నప్పటికినీ ప్రయోజనము లేదనిరి. దేశమునందలి ప్రజలు సుభిక్షముతో సంతోషముకలిగి యున్నయెడల కమ్యూనిజం ఎన్నటికీ వ్యాపించజాలదు గనుక పాలకులు అట్టి లక్ష్యమును సాధించుటకు పూనుకొనవలెనని కోరిరి. బిల్లు ఆక్షేపణలో పాలున్నందున బిల్లును సెలక్టు కమిటీ ఆలోచనకు నివేదించవలెననికూడ సూచించిరి.

పెయిన్‌గారు కమ్యూనిస్టుల ఉపద్రవం రాష్ట్రములో హెచ్చు పెరిగిపోవుచున్న కారణమున వారి అత్యాచారాలు అణచుట కిట్టిశాసనము అత్యవసరమనిరి. దేశములో అసంతృప్తి ప్రబలటానికిగల కారణములను ప్రభుత్వమువారు తొలగించుటకు పూనితే యిటువంటిశాసనములకు అగత్యమే యుండదనిరి.

సీతిసాహెబుగారుకూడా సామాన్యజనుల స్థితిగతులను అభివృద్ధిపరచగలిగితే కమ్యూనిజం ప్రబలకుండాచేసి ఆ విధముగా దానిని అణపవచ్చునని చెప్పి బిల్లును సెలక్టుకమిటీకి నివేదింపవలెనను ప్రతిపాదనను బలపరచిరి.

శ్రీ బి. యస్. మూర్తిగారు దేశములో ప్రజాశాంతిని రక్షించేకార్యములన్నిటిలో ప్రతివారు ప్రభుత్వానికి తోడ్పడంచాలా అవసరమే అయిననూ విశేషాధికారములు గల యిట్టిశాసనము చాలా సందర్భములలో దుర్వినియోగమే యగుచున్నదిగాని సరియైన పంథాలో అమలుకాకున్నదనిరి. ఆంధ్రదేశములో హరిజనులను ఉన్నతవర్గాలవారేగాక అన్నిపార్టీలవారు చాలా హింసకు పాలుజేస్తున్నారనియు, యీ అకృత్యాలు హరిజనులపై జరుగకుండా ప్రభుత్వం ముఖ్యముగా చర్య తీసుకొనవలెననియు కోరిరి. అబ్దుల్ మజీద్‌గారు రాష్ట్రప్రజలు నిజముగా స్వాతంత్ర్యము కలిగియుండవలసినట్టయితే యిట్టి శాసనము లేశమాత్రం యుండుట తగదని బిల్లును ప్రతిఘటించిరి.

[ఈ సమయంలో డిప్యూటీ స్పీకరు శ్రీమతి అమ్మన్నరాజాగారు అధ్యక్షపీఠము నలంకరించిరి.]

శ్రీ కక్కన్‌గారు తమిళములో బిల్లును హృదయపూర్వకముగా బలపరచిరి. శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ దేశమున ప్రజాశాంతి రక్షణకు యిట్టిచట్టములు అవసరమే యని ప్రభుత్వం యెంచియున్ననూ గ్రామాలలోని పరిస్థితులనుకూడా ప్రభుత్వము బాగాఎరిగి చట్టము యేవిధముగానైనా కూడా దుర్వినియోగము కాకుండా చూడవలసినబాధ్యత యున్నదనిరి – దేశములో దారిద్ర్యము, ఆహారకొరత మున్నగు క్లిష్ట స్థితిగతులున్నందున ఆ పరిస్థితిని చక్కబెట్టుట ముఖ్యధర్మము పేదవారలకు జమీందారిలలోని పోరంబోకు భూములను ఇచ్చి ఆహారోత్పత్తి ఎక్కువచేస్తే ప్రజల కష్టములు అసంతృప్తికి పరిస్థితులు చక్కబడునని, ప్రజలలో కమ్యూనిస్టుల చొరవతగ్గి దేశానికి శాంతిభద్రతలు తప్పక చేకూరగలదని ప్రజారక్షణం పేర పోలీసులు కమ్యూనిస్టులను చూపమని గ్రామప్రజలను స్త్రీలు పురుషులను నానా అమానుష కృత్యాలకు గురిజేస్తున్నారని చెప్పిరి. అట్టి పోలీసు అత్యాచారాలు సాగుచుండుటవల్ల ప్రభుత్వముయెడల ప్రజలకు అయిష్టము ప్రబలుచున్నదనియు యీ విధముగా ప్రజాహింస జరుగకుండా ప్రభుత్వము జాగ్రత్త వహించవలెనని కోరిరి. కమ్యూనిస్టులు పట్టియిచ్చుటకు ప్రజలే తోడ్పడుటకు సిద్ధముగానున్నపుడు కమ్యూనిస్టులను వెదికివ్వమని చెప్పి అమాయకులను హింసించుట యేమిన్యాయమనిరి.

అన్వర్ సాహేబుగారు దేశములో ప్రమాదపరిస్థితి యున్నదనే పేరుతో ప్రభుత్వము పౌరహక్కులను చులకనచేస్తూ అణచివేయుచున్నదనిరి.

అంతటితో సభవారు భోజనవిరామమునకు లేచిరి.

### మంత్రిగారి జవాబు

అసెంబ్లీ సమావేశం కాగానే ప్రజారక్షణ చట్టముపై చర్చకు మంత్రి [illegible] ఒక గంటసేపు జవాబు చెప్పిరి. చర్చ బడ్జెటు సమయాన పరిపాలనా వ్యయానికి సంబంధించిన చర్చగాలె, ధరలగూర్చి కార్మికుల స్థితిగూర్చి ప్రజల అసంతృప్తి గూర్చి సభ్యులు మాట్లాడినందున, అన్నింటికీ జవాబు చెప్పట కష్టమనిరి. ఈ చట్టం ప్రజా హక్కులను నిర్మూలించుచున్నదని ఒకే విసురువిసరిరి. [illegible] ప్రజాని స్వాతంత్ర్యాలకు [illegible] చట్టం [illegible] కొందరు ఉద్యోగులు గుర్తించకుండా చేస్తున్నారన్న తీవ్రమగు విమర్శ. ప్రజలలో అసంతృప్తియున్నమాట నిజమే ధరలు మూడు నెలల క్రిందటకన్న పెరిగినవి. అందుకు అసంతృప్తి యుండవచ్చు. కొని దేశంలో అసంతృప్తి పెంచడానికి పూనేవారు, అసంతృప్తికి కారణాలు తొలగించ నిరోధం కలిగించిన వారిపై చర్యతీసుకొనరాదంటే ఎలాగ? తినుచున్న కోతలు కోయనీయలేదు. వరినాట నివ్వలేదు. పని చేయండి పంట ఎలావచ్చును, తిండి ఎలా గుండును. కనుక అట్టివారి చర్యలకు గడంగుచున్న ఒక తెగను అణచుటకే యీ చట్టము. కమ్యూనిస్టుపార్టీ విడచినా మనివారిని వారిమాటవిని జిల్లా కలెక్టరులు వద్దన్నా నిర్బంధం నుండిస్తే వెంటనే జిల్లాలలోకి పోయి పంటలకోతలు జరగకుండా చేశారు. కనుక ప్రజల అసంతృప్తి తొలగించుటకే యీ ప్రయత్నమంతాను. మిల్లులు పని చేయకుండా చేస్తున్నారు. ప్రజలనుతిరుగుబాటునకు లేవనెత్తి కమ్యూనిస్టులు కనబడకుండా పారిపోతున్నారు. పరిపాలనకు నిరోధం కలిగించినవారిని నిర్బంధించక తప్పదు. అసంతృప్తికి కారణము తొలగించుటకు ముందు, కారకులను తొలగించాలి.

"ప్రజాహక్కుల రక్షణ గూర్చి ఎన్ని సిద్ధాంతాలైనా చేయవచ్చును. స్వాతంత్ర్యం వచ్చినాక మనదేశంలో ఎవరినైనా విమర్శించే అధికారం ప్రతివారికి వచ్చింది.

బి. ఎస్. మూర్తి—మంత్రిగారు శాసనసభ్యుల వాక్స్వాతంత్ర్యాన్ని విమర్శించుచున్నారు.

మంత్రి :- నేను శాసన సభ్యుల ఉపన్యాసాల గూర్చి తెలుపలేదు. దేశంలో ఉపన్యాసాల గూర్చి తెల్పుచున్నాను. ప్రతికూల పక్షం సభ్యులు తమ విధి కనుక ప్రతికూలంగ మాట్లాడుచున్నారు. ప్రజా సమూహం యొక్క హక్కులను కాపాడుటకే నాటిని నిరోధించుచున్న వ్యక్తులను నిర్బంధించుచున్నాం. మధురలో కొందరు హోటలుకి పోయి భోజనముచేసి డబ్బడుగగ, కొడవలి చూపిరి.

"ఆచంట వేమవరంలో సుబ్బరాయుడుండగా కాంగ్రెసుకీ ప్రతికూలంగా తను సంస్థను స్థాపించ వీలులేదు కనుక, కొడవలితో అతన్ని ముక్కముక్కలుగ కమ్యూనిస్టులు కోసి వేసిరి. రెండురోజుల వరకు 5000 మంది గ్రామస్థులలో ఒక్కరు గూడ సాక్ష్యం చెప్పరాలేదు. అర్థరిని అరెస్టుచేసినాక, అందరు బయటకు వచ్చిరి. ఈ విధంగ కొందరు ప్రజలను భయపెట్టుచు, ప్రజల నోళ్ళకు తాళం వేయుచున్నారు. అట్టివారి స్వాతంత్ర్యం అరికట్టక తప్పదు.

పోలీసులు తమ అధికారాలను దుర్వినియోగం చేయుట నిజమే అయియుండును. కూర్మయ్యగారు, సీతామహాలక్ష్మమ్మగారు కొన్ని వివరాలు చెప్పిరి. స్త్రీలను చెరిచినచో అది చట్టప్రకారం చేసిన పనికాదు. అటువంటి పొరబాటులు అక్రమాలు ఆర్డినెన్సు చట్టంక్రింద ఇంగ్లండులోనూ చేసినపుడేగాక, సాధారణమయిన క్రిమినలులా సవరణచట్టంప్రకారం జరిగేసోదాలందుగూడ జరుగవచ్చును. అట్టిం జరుగకుండా చూచుకోవచ్చునుగాని అందుకని తన అధికారులకు యివ్వరా దనకూడదు. సాధారణంగా చట్టంప్రకారం ఉన్న అధికారం చాలనపుడు ఎక్కువ అధికారాలు యివ్వాలి.

"ఒకటి రెండుచోట్ల లేక అరడజను చోట్ల అలా జరిగిన పోలీసులంతా అలా గున్నారనుకోరాదు. అధికారాలు దుర్వినియోగం జరిగినచో అందరివృష్టిలో పడును. ప్రజలు నిరోధించినపుడు ఎగతాళి చేసినపుడు ఏదో ఒక ఉద్యోగి అక్రమం చేసితే అందరిని నిందచేయరాదు. కమ్యూనిస్టును పట్టడానికిపట్టిన కనిస్టేబులు బ్రతికిరాలేదు. అక్రమాలు చేసిన పోలీసుల చర్యలను నేను సమర్థించలేదు.

"కడలూరు జెయిలులో [illegible] వేరకు యిస్తే దాన్ని [illegible] పోలీసులు కొట్టిరి. (జెయిలులో కోరిన సదుపాయాలు వంటి లాకీలను సభ్యులకు చూపెట్టిరి. కొని నిబంధనలు అంగీకరించనందున [illegible] చేయజాలననిరి) మన [illegible] కమ్యూనిస్టు కార్యక్రమములు విప్లవం తెచ్చి పెటదలచిరి. గావున వారిని నిరోధించుట [illegible]

"హైకోర్టు తీర్పు ననుసరించి ఇక్ష్కెప్పి అనుబంధ ఫురావుకు లందున్న [illegible] చూచుకోవాలని, గడిచిపోయిన కాలానికి వర్తింపజేసే వ్యక్తులను నిర్బంధించరాదని జిల్లా మేజస్ట్రేటులకు ఉత్తరువు చేసితిమి. (అని చెప్పి రహస్యపు సర్క్యులరు భాగాలు చదివి వినిపించిరి)

"హైకోర్టువారు తీర్పునిచ్చిన [illegible] కాని అట్టివారు కమ్యూనిస్టులకు తోడ్పడుచున్నారని తెలిసియే జిల్లామేజస్ట్రేటు నిర్బంధించెను. కాని అది రుజువుచేయలేదు. అందుచే [illegible]

48 నవంబరులో 744 కమ్యూనిస్టు నిర్బంధితులు, 1949లో 1169 మందివుండిరి. 69 కేసులలో హెబియస్ కార్పస్ దరఖాస్తులు హైకోర్టువారు విచారించి విడచిరి ప్రభుత్వంవారే 609 మందిని విడుదల చేసిరి. నేడు 665 మంది కమ్యూనిస్టులు నిర్బంధమునందున్నారు. నిరుటికన్న 100 మంది తక్కువ. ఈ సంఖ్య పెరగకుండా లనే నేను కోరుచున్నాను.

తిరుగుబాటుచేక జిల్లా అధికారులు కొందరి నిర్బంధానికి కారణాలు వ్రాసి యివ్వలేక పోవుదురు. అట్టివారి నిర్బంధం అలక్ష్యం కారాదు. వీలయినంత ఎక్కువ శ్రద్ధవహించి జాగ్రత్తగానే చట్టం అమలు జరుపుదుమనిరి. 1947 చట్టానికి దీనికి ఎటువంటి భేదంలేదు. 2వ క్లాజు యీ చట్టానికి ప్రాణంవంటిది. సలహాసంఘం సమావేశం కాకపోలేదు. రాత్రింబగళ్లు పని చేసిరి.

"సలాం సాహెబుగారు మాలో కొందరు నిర్బంధమునందుండదగినవారన్నారు. నేరాలుంటే, మంత్రులపై ఫిర్యాదులు చేసి కోర్టులలో విచారణ చేయించవచ్చు. మాకేమీ ప్రత్యేకగతులు లేవు."

సలాం సాహెబు : మంత్రులపై ఫిర్యాదులు కాంగ్రెసు హైకమాండు విచారించుచున్నది.

మంత్రి : అది కోర్టు కాదు. సలాంగారు కాంగ్రెసును ఉదహరించుట ఏదో సామెత చెప్పినట్లున్నది. (నవ్వు) భార్య జబ్బుగానున్నదనగా పెరోలుపై విడుదల చేస్తే ఒకడు కనబడకుండా పారిపోయెను. పోరాడి సంపాదించిన స్వాతంత్ర్యం కాపాడుటకే యీ చట్టం చేయుచున్నాము. దీనిగూర్చి కొత్తపడవలసిన అవసరం లేదు అంచెప్పి చట్టం సెలక్టుకమిటీకి పంపనవసరంలేదనిరి.

న్యాయమంత్రి శ్రీ మాధవమీనన్ ప్రజారక్షణ బిల్లుచర్చకు సమాధానము ఇచ్చినతరువాత రజాఖాన్ సెలెక్టుకమిటీకి పంపవలెనను ప్రతిపాదనను ఉపసంహరింప నిరాకరించినందున స్పీకరు సభ్యుల ఓటు తీసుకొని రజాఖాన్ ప్రతిపాదన వీగిపోయెనని ప్రకటించిరి.

తరువాత క్లాజువారీ చర్చ ప్రారంభము కాగానే శ్రీ తెన్నేటి విశ్వనాథముగారు క్లాజు 1 సబ్‌క్లా (3) ఫుల్‌స్టాప్ను తీసివేసి 1950 డిశెంబరు 31 వరకు అమలులో వుండును." అనే సవరణను ప్రతిపాదించిరి.

జనాబ్ హమీద్‌ఖాన్ సవరణను బలపరచుచూ ప్రజాస్వామిక పద్ధతులలో విశ్వాసమున్న వారందరూ ఈ సవరణను అంగీకరించవలెననిరి.

శ్రీ వైద్యనాథ అయ్యగారు మాట్లాడుచూ గను వు 2 సం॥ ములకు పరిమితము చేయవలెననిరి.

శ్రీ విస్సులకంటి రాఘవయ్యగారు ఒక శాసనమును చేసినప్పుడు దానిని నిర్దిష్టకాలము అమలు జరుపవలెననిరి.

మంత్రి మాధవమీనన్‌గారు జవాబు ఇచ్చుచూ 1951 వరకు పరిమితి మొనర్చిన నూతన ఎన్నికలు రాగలవనియు, క్రొత్త ప్రభుత్వమునకు చిక్కు కలుగకుండా 1952 వరకు అమలులో వుండునని నిర్ణయించబడినదనిరి. శ్రీ విశ్వనాథముగారి సవరణ ఓటుకు పెట్టవీగిపోయినట్లు స్పీకరు ప్రకటించిరి.

తరువాత న్యాయమంత్రి 1952 సెప్టెంబరు 30 వరకు అమలులో వుండునని సవరణను ప్రతిపాదించిరి.

జనరలు ఎన్నికలు ముందు ప్రభుత్వము అనుసరించవలసిన విధానమును నిర్ణయించుకోవచ్చును. అందువలన విధానము ముందుగానే ఈ చట్టమును చేసి బంధించ అవసరము లేదనిరి.

జనాబ్ అన్సారీ క్లాజు 2-ఏ (1) లో "మూడుసెలలకు తక్కువ" అనేమాటలు తీసివేయవలెనని సవరణ ప్రతిపాదించి, జనాబ్ సలాంసాహెబ్ బలపరచిరి.

శ్రీ వైద్యనాథయ్యర్ కఠినంగా వుండవలసినచోట కఠినంగా వుండాలి. మానవత్వము [illegible] కొన్నిచోట్ల అవసరమవుతుంది, కనుక తల్లిని శిక్షార్హుల జాబితా [illegible] నలెనరి అన్సారీ సవరణ ఓటుకు పెట్టగా వీగిపోయెను.

క్లాజు 2-ఏ (1) (ఎ) లో ప్రకట ఆనేమాటలకు బదులు "ప్రజాశాంతి భంగకరమైన" అనేమాటలు చేర్చవలెనని జనాబ్ అన్సారీ సవరణ ప్రతిపాదించిరి. సలాం సాహెబ్ బలపరచిరి న్యాయమంత్రి సవరణను అంగీకరించుటకు వీలు లేదనిరి. స్పీకరు సవరణను ఓటుకుపెట్టి వీగిపోయెనని ప్రకటించిరి.

క్లాజు 3 సబ్‌క్లాజు (3) లో "అవసరమైనప్పుడు" అనేమాటలను తీసివేయవలెనని సవరణ ప్రతిపాదించిరి. ప్రతిపాదనను బలపరచుచూ జనాబ్ అబ్దుల్ సలాం "అవసరమైనప్పుడు" అనే మాటలవల్ల రక్షణలు బలహీనమవుతున్నవనిరి.

శ్రీ భాష్యం మాట్లాడుచూ శత్రువు అర్థముచేసుకొనకుండా సవరణ ప్రతిపాదించబడినదనిరి. చట్టములో సలహాసంఘమును విధిగా నియమించవలసిన అవసర మున్నది. ఈమాటలు అనవసరం అని అన్నారు.

జనాబ్ హమీద్‌ఖాన్ చట మున్నంతకాలము సలహాసంఘము ఉండవలెననిరి.

న్యాయమంత్రి భాష్యముగారు చెప్పిన ప్రతిమాటతో ఏకీభవించుచున్నామనిరి ఓటుకుపెట్టగా సవరణవీగిపోయెను.

జనాబ్ అన్సారీ క్లాజు 4 (1) కు ప్రతిపాదించిన సవరణకూడ వీగిపోయెను.

శ్రీ తెన్నేటి విశ్వనాథముగారు 4 (ఎ) క్లాజును తీసివేయవలెనని సవరణ ప్రతిపాదించిరి హైకోర్టువారి విమర్శలను గమనించి వుత్తర్వవగిరా సకాలములో పత్యరముగా చేసినట్లు చూడవలెననిరి. ఈక్లాజు వలన హైకోర్టు వుత్తర్వులను అమలు జరుపనట్లే అవుతుందనిరి.

శ్రీ భాష్యంగారు సవరణను బలపరచుచూ వుత్తర్వులు స్పష్టముగా ఎట్టి అనుమానములకు తావులేకుండా వుండవలెననిరి.

శ్రీ వైద్యనాథఅయ్యర్ ఈ క్లాజు సామాన్య ధర్మసూత్రములకే విరుద్ధము, భంగకరమునిరి. ఇటువంటిక్లాజులు ఎన్ని తప్పుకవుంటే అంత మంచిదనిరి.

జనాబ్ హమీద్‌ఖాన్ న్యాయచింతగల ప్రతిసభ్యుడు ఈక్లాజును ప్రతిఘటించగలడనిరి ఈక్లాజువల్ల ప్రభుత్వోద్యోగులకు లైసెన్సు ఇచ్చినట్లవుతుందనిరి. ప్రభుత్వము తన తప్పును సరిదేసుకొనుటకు బదులు ఉన్నత న్యాయస్థానమును త్రోసి రాజనుచున్నదనిరి.

జనాబ్ రజాఖాన్ ఈక్లాజు ఎందుల్ల చేర్చవలసివచ్చిందో తెలియదనిరి. మంత్రిగారు [illegible] ఈ క్లాజును [illegible] సవరించాలెననిరి.

సభ మర్నాడు 10 వ తేదియుదయం 11 లకు వాయిదాపడెను.

# శాసనసభలో ప్రశ్నోత్తరాలు

చెన్నపట్నం, నవంబర్ 9.

ప్రభుత్వఆస్పత్రులందు రూ 50 లోపు రాబడిగలవారికే ఉచితంగా చికిత్స చేయుచున్నారనియు, యీ రాబడి ప్రమాణం పెంచుటగూర్చి ప్రభుత్వంవారాలోచించుచున్నారనియు, బేగం అమీరుద్దీనుగారికి ఆరోగ్యశాఖమంత్రి డా॥ రాజనుగారు నేడు ప్రశ్నలకాలమున బదులు చెప్పిరి వానుగజిలెడు ఆఫీసరులను ప్రత్యేకంగా చూడరనియు, వారికిరాబడిపట్టియే వనులు చేయుదురనియు, మంత్రులకు గూడ యీ నిబంధననుండి మినహాయింపు లేదనియు, ఉపప్రశ్నలకు బదులుగ చెప్పిరి.

### ప్రభుత్వం తయారుచేసిన రేడియో సెట్లు

ప్రభుత్వ రేడియో ఇంజనీరు ప్రయత్నించి భాగాలుతెచ్చి తయారుచేసిన రేడియో యంత్రాలు అన్ని రేడియో ప్రసారములను అందుకొనుచున్నవనియు, అందు 20 సెట్లు పంచాయితీబోర్డులకు ఒసంగబడెననియు, మిగిలినవి త్వరలో పాఠశాలలందు యితర సంస్థలందు స్థాపించబడుననియు గౌ॥ భక్తవత్సలంగారు ఇస్మైలుగారికి బదులు చెప్పిరి. ఒకొక్క సెట్టు రూ 280 లేక 290 అయిందనిరి. ప్రయత్నాలు ఫలించినచో ఫాక్టరీ స్థాపించుట గూర్చి ఆలోచింతుమనిరి.

### న్యాయశాఖ విభజన

అక్టోబరు 2 వ తేదీనుండి రెండు జిల్లాలలో న్యాయపరిపాలన, న్యాయవిచారణ శాఖల విభజన జరిగెననియు, జనవరినుండి బళ్లారి, అనంతపురం, చిత్తూరు, తిన్నవెల్లి జిల్లాలందు అమలు జరుపబడుననియు, గౌ॥ మాధవమీననుగారు ఇస్మైలుగారి ప్రశ్నకు బదులు చెప్పిరి. కడప, కర్నూలులందు జనవరిలో అమలు జరుప. వీలులేదని నాగప్పగారికి బదులు చెప్పిరి. ఏచోట నుండి లాయరులు ఎవ్వరు ఆక్షేపించలేదనియు, పరిపాలనా సౌకర్యంకొరకు రాష్ట్రమంతట ఒక్కమారుగ కాక, కొన్ని కొన్ని ప్రాంతాల ముందుగ అమలుజరుపుచున్నామనియు, ఉపప్రశ్నలకు బదులు చెప్పిరి

ఈ స్కీములో క్రొత్తగ నియమింపబడిన మేజస్ట్రేటులలో నూరెంట 80 మంది లాయరులనియు, మిగిలిన 20 మంది రెవిన్యూశాఖవారు, పబ్లికు ప్రాసిక్యూటరు [illegible] సంఖ్యలో 66% మంది [illegible] వారేవనియు, అగ్వా [illegible]

### రాష్ట్రాదాయం కేంద్ర ప్రభుత్వం తీసుకోలేదు

జులయిలో జరిగిన రాష్ట్ర కేంద్ర ప్రభుత్వముల ఆర్థికమంత్రులసభా నిర్ణయం ప్రకారం, నూతన రాజ్యాంగ విధానమున 260 ఆర్టికలు సవరించి, రెండు సంవత్సరములలోగా, ఆర్థిక విచారణసంఘమును నియమించి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వముల ఆర్థికసంపక విధానము నిర్ణయింప నిశ్చయింపబడెనని, గౌ॥ గోపాలరెడ్డిగారు ఇబ్రహింగారి ప్రశ్నకు బదులు చెప్పిరి. ఈ నిర్ణయంప్రకారం రాష్ట్రాలకు యిక ముందు ఎక్కువరాబడి గలదనియే ఆశించుచున్నామనిరి.

ఈ ప్రశ్నపై అనేక ఉపప్రశ్నలు వచ్చినవి. వాటికి బదులుగ, రాష్ట్రములు వేస్తున్న పన్నులేవి కేంద్ర ప్రభుత్వం తీసుకోదనియు, ఎగుమతులపై సేల్సుటాక్సు విధించరాదన్నారు. కనుక దానివల్ల ఒకటి రెండుకోట్లు రాబడి తగ్గుననియు, ప్రకటనల పన్ను అన్ని రాష్ట్రాలలో ఒకేవిధంగా కేంద్ర ప్రభుత్వంవారు విధించి, రాష్ట్రాలకు వారి వారి భాగాలు పంచగలరనియు, తెలిపిరి

కేంద్ర ప్రభుత్వంవారి ఆర్థికపాదుపు విధానంవలన మదరాష్ట్రానికి కేమయిన నష్టం కలిగిందాయని హమీదుఖానుగారడుగ, యీ సంవత్సరం యుద్ధానంతరం స్కీములకు యిస్తానన్న రూ. 5 కోటను 4 కోట్లకు తగ్గించిరనియు, వచ్చేయేడు యిస్తారో లేదో తెలియదనియు మంత్రిగారు తెలిపిరి.

కేంద్రప్రభుత్వంవారు 10 కోట్ల ఋణమివ్వ నిరాకరించినందున, ప్రయివేటు ఋణాలు చేయుటకు ఆర్థికమంత్రిగారు చేస్తున్న యత్నాలు ఎంతవరకు ఫలించినవని రజాఖానుగారడుగ, ఆ విషయమై పలయివాక సభలో చర్చించుటకు అవకాశ మిత్తునని మంత్రిగారనిరి.

### శబ్దగ్రహణంలో శిక్షణ

సినిమా టోగ్రఫీలో శిక్షణకు 1948-49 లో మద్రాసు ప్రభుత్వము శ్రీనివాసన్ అను విద్యార్థిని విదేశాలకు పంపెననియు, కేంద్ర రాష్ట్రప్రభుత్వములు చెరిసగము ఖర్చు భరించుననియు విద్యామంత్రి మాధవమీనన్‌గారు ఇస్మయిల్‌గారికి సమాధానముగా చెప్పిరి. చెన్నరాష్ట్రము ఇండియాలోని హాలీవుడ్ అనుచుండ ఇంతి కన్న ఎక్కువమందిని పంపనవసరం లేదా? అని ఒకరు అడుగగా, అవసరమైన పంపగరరి. రాష్ట్రప్రభుత్వం నియమించిన సలహాసంఘంవారు ప్పిన వాళ్ల పేర్లేగాక వేరే ఒక వ్యక్తిని కేంద్ర ప్రభుత్వము నిర్ణయించెననిరి. కేంద్రప్రభుత్వం ఆ సల్గురి కన్న అర్హతకలవాణ్ణి ఎన్నుకొనెనేమో చెప్పలేమని మంత్రిగారనిరి.

మహమ్మద్ ఇస్మయిల్‌గారికి సమాధానంగా విద్యామంత్రిగారు సాంఘిక విద్యావ్యాప్తికి 1.57 లక్షలు కేంద్రప్రభుత్వ ఇస్తానన్నదనియు, అందువల్ల మొత్తం 26 లక్షలు స్కీమును ఈవిధముగా మార్చుచున్నారనియు తెలిపిరి.

### కేంద్రప్రభుత్వ ఋణం

కేంద్రప్రభుత్వం మద్రాసువారు అడిగిన పది కోట్ల ఋణమును నిరాకరించెనన్నమాట రహస్యమైనదని ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు తెలిపిరి. వారు ఎంత నిరాకరించినారని అడుగగా అది చెప్ప వీలు లేదనిరి. ఆరు కోట్లు నిరాకరించినారనిమంత్రిగారు మరో ప్రశ్నకు తెలుపగా అందు ఇక రహస్యమేమున్నదని కొందరు అడిగిరి. మద్రాసు ప్రభుత్వంవారు అడిగినది రహస్యమని మంత్రిగారు తెలిపిరి.

### భూమిలేనివారికి సహాయం

విస్సులకంటి రాఘవయ్యగారికి సమాధానముగా వ్యవసాయమంత్రి భూమి లేని వ్యవసాయ కూలీల ఋణనివారణ ఎందర్భమున ఒక శాసనము ఆలోచనలో ఉన్నదని తెలిపిరి. ఇందు జరుగుచున్న ఆలస్యం వల్లనే కమ్యూనిజం శీఘ్రగతిని వ్యాపించుచున్నదిగదా అని రాఘవయ్యగారు అడుగగా మంత్రిగారు తాము ఈ విషయమున ఏమీ చెప్పలేమనిరి. రాజగోపాలాచారిగారు పదేళ్ళ క్రితమే ఈ శాసనంరానున్నదని చెప్పినా ఇంతవరకూ రాకపోవుట ప్రభుత్వ అశ్రద్ధ తెలుపుట లేదా అనగా ఈ విషయమై తాము ఏమీ చెప్పలేమని మంత్రిగారనిరి.

### జమీందారీ బిల్లు

మద్రాసు జమీందారీబిల్లు శాస్త్రీయంగాదని దావాలు వేసెదమని రమ్నాడు, వెంకటగిరి, శేతూరు జమీందారులు ప్రభుత్వమునకు నోటీసు ఇచ్చినారనియు, ప్రభుత్వంవారు ఆ దావాలకు ఎదురుచూచుచున్నారనియు రెవిన్యూమంత్రి సీతారామ రెడ్డిగారు ఇస్మయిల్‌గారికి సమాధానముగా తెలిపిరి.

ఇస్మయిల్‌గారు : జమీందార్ల పెనరింపుకు లోంగి 50% పరిహారము ఇచ్చుటకు శాసనం ప్రభుత్వంవారు తెచ్చు [illegible] ప్రాయ [illegible] గారు గమనించినారా?

[illegible] రించను.

### పంచాయితీలు

ఇస్మయిల్‌గారికి సమాధానముగా స్థానికశాఖామాత్యులు చంద్రమౌళిగారు చెన్నరాష్ట్రమున మే మొదటి తేదీకి 4176 మేజరు పంచాయతీలు, 7192 చిన్న పంచాయితీలు ఉన్నవనియు 362 పంచాయితీలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు ఉన్నారనియు, వారికి కులతత్వ నిబంధన అనుసరింపబడకపోయినా నిమ్నజాతుల రక్షణ పరిగణింప బడుచున్నదనియు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ల ఉద్యోగం అవసరమనియు తెలిపిరి.

### తూ. గో॥ ధాన్యాల లైసెన్సులు

ఇస్మయిల్‌గారికి సమాధానముగా తూర్పుగోదావరి జిల్లాలో 1949 ప్రథమ అర్ధసాలున 45 ఆహారధాన్యాల లైసెన్సులు ఇవ్వబడెనని ఆహారమంత్రి తెలిపిరి. వాటిపై వచ్చిన ఉపప్రశ్నకు పరంపరకు సమాధానముగా ఎందరు శాసనసభ్యులు, ఎందరు [illegible] ఎందరు ఉన్నారో చెప్పలేమనిరి. అందు ఏమైనా పద్ధతి ఉన్నదా అని విశ్వనాథంగారు అడుగగా కలెక్టర విచక్షణ, కొన్ని నిబంధనలు ఉన్నవనియు, అక్రమాలు ఉంటే చూపితే విచారించెదమని మంత్రిగారు తెలిపిరి.

ఇదివరకు లైసెన్సులు ఉన్న శాసనసభ్యులకు ఉండనిచ్చినారు గాని వారు శాసనసభ్యులైనందున లైసెన్సులు ఇవ్వలేదని మంత్రిగారనిరి ఉత్పత్తి వినియోగ సహకారసంఘముల రద్దువల్ల ఈ అక్రమాలు అన్నీ వచ్చినవిగదా అని రాఘవయ్యగారు అడుగగా వేరే ప్రశ్న వేయవలెనని మంత్రిగారనిరి.







Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras